# శ్రీ వరసిద్ధి వినాయక వ్రతకల్పము



శ్లో॥ తొండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్ ॥


**గబ్బిట సూర్యనారాయణ శర్మ పురోహితులు**

సత్యనారాయణపురం, విజయవాడ - 520011

*Insurance Agent :*

**LIC, Star Health & National Insurance**

**Cell : 8121441218**

**గబ్బిట లక్ష్మీనారాయణ శాస్త్రి (DTP Works)**

గుణదల, విజయవాడ - 520004, సెల్ : 9494531807

## వినాయక వ్రతమునకు కావలసిన పూజా ద్రవ్యములు

పసుపు, కుంకుమ, తమలపాకులు, వక్కలు, అగరువత్తులు, కర్పూరము, గంధం డబ్బా, అరటిపండ్లు, విడిపువ్వులు, పూలమాలలు, పత్తితో చేసిన వస్త్రములు, ఒత్తులు, యజ్ఞోపవీతము, తుండుగుడ్డ, బియ్యము, రూపాయిబిళ్ళలు, కొబ్బరికాయలు, బెల్లం, పాలవెల్లి, గొడుగు, గరిక, పత్రి, లావు పురికోస, వినాయకుని ప్రతిమ, మందిరము, అరటిపిలకలు, మామిడి ఆకులు, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, తేనె, పంచదార, పుస్తకములు, కలము, దీపారాధన కుందులు, పంచపాత్ర, ఉద్ధరిణె, అరవేణియం, హారతి, గంట, పళ్ళెములు, గ్లాసులు, కలశారాధనకు చెంబు.

**ప్రసాదములు :** చలివిడి, వడపప్పు, పానకం, క్షీరాన్నం, పులిహోర, పూర్ణములు, జున్ను, కుడుములు.

**కలశ స్థాపనకు :** కలశమునకు చెంబు, అఖండ దీపారాధనకు ఎర్రమట్టిమూకుడు, నువ్వుల నూనె, విస్తరాకులు, ధాన్యము, ఇటుకలు, ఒత్తి, పసుపుకొమ్ములు, ఖర్జూరపు కాయలు, అంగవస్త్రముల చాపు, జాకెట్ ముక్కలు.

శ్లో॥ దైవాధీనం జగత్సర్వమ్ మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోనై మమదేవతా ॥

దేవీ దేవతల పూజా కార్యక్రమములు, వ్రతములు ఆచరించుటకు, తెలుసుకొనుటకు ఎన్నో పుస్తకములు ప్రచురణములైనప్పటికీ మనచేత పూజలు, వ్రతములు ఆచరింపచేయుటకు బ్రహ్మగారిని నియమించుకుని వారిచే పూజ చేయించుకొని మనము పూజించిన దేవీ దేవతల అనుగ్రహము, ఆశీర్వచనము పొంది తీర్థ ప్రసాదములు స్వీకరించి ఆ బ్రహ్మగారికి యధాశక్తిగా దక్షిణ తాంబూలములు, అన్నవస్త్రములు (స్వయంపాకము, వస్త్రములు) సమర్పించి శ్రీ మహావిష్ణు స్వరూపమైన ఆ బ్రహ్మగారి ఆశీస్సులు పొంది శ్రీ పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహమును పొందగోరుచున్నాము.



గోవులను సేవించండి. గోవులను పూజించండి.
గోవులకు గ్రాసము సమర్పించండి.
సకల దేవతల స్వరూపమైన గోమాత అనుగ్రహమునకు పాత్రులు కండి.
గో సేవయే గోవిందుని సేవ



ధర్మస్య జయోస్తు - అధర్మస్య నాశోస్తు - ప్రాణిషు సద్భావనాస్తు
విశ్వస్య కళ్యాణమస్తు - గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా సుఖినో భవంతు



ఓం శ్రీరాము

శ్రీరస్తు 	శుభమస్తు 	అవిఘ్నమస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః 	శ్రీ మహాసరస్వత్యై నమః 	శ్రీ గురుభ్యోనమః

హరిః ఓమ్

దేవీం వాచమజనయన్తదేవాస్తాం విశ్వరూపాః పశవోవదన్తి । సానో మన్ద్రేష మూర్జందుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు ॥ అయం ముహూర్తస్సు ముహూర్తోస్తు ॥

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమఙ్గళా ।
తయోస్సంస్మరణాత్పుంసాంసర్వతో జయమఙ్గళమ్ ॥

వాగీశాద్యా స్సుమనసస్సర్వార్థానాముపక్రమే । యంనత్వాకృత కృత్యాస్స్యుస్తం నమామి గజాననమ్ । అచిన్త్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే । సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః ॥ శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే ॥ తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చన్ద్రబలం తదేవ । విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతేతేంఘ్రి యుగం స్మరామి ॥ యత్రయోగీశ్వరఃకృష్ణో యత్ర పార్థోధనుర్ధరః । తత్రశ్రీర్విజయో భూతిర్ధ్రువానీతిర్మతిర్మమ । స్మృతే సకల కళ్యాణ భాజనం యత్రజాయతే । పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణంహరిం । సర్వదా సర్వకార్యేషు నాస్తితేషా మమఙ్గళమ్ । యేషాం హృదిస్థో భగవాన్మఙ్గలాయతనం హరిః ॥ లాభస్తేషాం జయస్తేషాంకుతస్తేషాం పరాభవః । యేషామిన్దీవరశ్యామో హృదయస్థో జనార్దనః । ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదాం । లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం । సర్వమఙ్గళమాఙ్గళ్యే శివే సర్వార్థసాధికే । శరణ్యేత్ర్యమ్బకే దేవినారాయణి నమోస్తుతే ॥ శ్రీలక్ష్మీ నారాయణాభ్యాం నమః । శ్రీ ఉమామహేశ్వరాభ్యాం నమః । శ్రీ వాణీహిరణ్య గర్భాభ్యాం నమః । శ్రీ శచీ పురన్దరాభ్యాం నమః । శ్రీ అరున్ధతీవసిష్ఠాభ్యాం నమః । శ్రీ సీతారామాభ్యాం నమః । సర్వేభ్యో మహాజనేభ్యోనమః ॥

దీపారాధన :

శ్లో॥ దీపస్త్వం బ్రహ్మ రూపోసి । జ్యోతిషాం ప్రభురవ్యయః
సౌభాగ్యం దేహిపుత్రాంశ్చ । సర్వాన్కామాంశ్చ దేహిమే ॥

ఘంటారావం :

శ్లో॥ అగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కురుఘంటారావం తత్ర దేవతాహ్వాన లాంఛనం ॥

ఆచమ్య, ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయస్వాహా, ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూధనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సఙ్కర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః ॥

శ్లో॥ ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః యేతేభూమి భారకాః
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్ । ఓమాపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ ॥

మమోపాత్త సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వన్తరే - కలియుగే - ప్రథమపాదే - జంబూద్వీపే - భరతవర్షే - భరతఖండే - మేరోర్దక్షిణ దిగ్భాగే - శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే - కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే - శోభనగృహే - సమస్త దేవతా గో బ్రాహ్మణ హరి హర గురుచరణ సన్నిధౌ - అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాన్ద్రమానేన శ్రీ ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే శ్రీ ........... సంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ భాద్రపదమాసే శుక్లపక్షే చతుర్థ్యాం తిథౌ ........... వాసరే ........... శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ గోత్రః .............. నామధేయస్య .............. ధర్మపత్నీ సమేతః

శ్రీ మతః గోత్రస్య - నామధేయస్య - ధర్మపత్నీ సమేతస్య । సహకుటుంబస్య, క్షేమ స్థైర్య ధైర్య విజయాయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం పుత్ర పౌత్రాభి వృద్ధ్యర్థం సర్వాభీష్ట సిద్ధ్యర్థం సకల విద్యా ప్రాప్యర్థం సమస్త మంగళావాప్త్యర్థం సమస్త దురితోప శాంత్యర్థం వర్షే వర్షే ప్రయుక్త శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ముద్దిశ్య శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం హరిద్రా బింబే - శ్రీమహాగణాధిపతి దేవతా పూజాఙ్కరిష్యే।

తదఙ్గ కలశారాధనఙ్కరిష్యే । కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య । కలశే ఉదకం పూరయిత్వా ।

కలశస్యోపరి హస్తం నిధాయ ।

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్మృతాః ।
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసున్ధరా ।
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।

అఙ్గైశ్చసహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥ ఆకలశేషుధావతి పవిత్రే పరిషిచ్యతే । ఉక్తైర్యజ్ఞేషువర్ధతే ॥ ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావాఆపః పశవ ఆపోన్నమాపోమృతమాపస్సమ్రాడాపోవిరాడాపస్స్వరాడా పశ్ఛన్దాగ్స్యాపోజ్యోతిగ్ష్యాపో యజూగ్ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతా ఆపోభూర్భువస్సువరాప ఓమ్ ।

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి ।
నర్మదే సిన్ధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥
కావేరీ తుంగభద్రాచ కృష్ణవేణీచ గౌతమీ ।
భాగీరథీచ విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ॥

ఆయాన్తు - శ్రీమహా గణాధిపతి దేవతా పూజార్థం - దురితక్షయకారకాః కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య - దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య । తదఙ్గ శ్రీ మహాగణాధిపతి దేవతా ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే ॥

## ప్రాణ ప్రతిష్ఠా

ఓమ్ - అసునీతేపునరస్మాసుచక్షుః పునః ప్రాణమిహనోధేహి భోగమ్ ।
జ్యోక్ప శ్యేమసూర్యముచ్చరన్త మనుమతే మృడ యానస్స్వస్తి ।
అమృతం వైప్రాణాఅమృతమాపః ప్రాణానేవయథాస్థానముపహ్వాయతే ॥

శ్రీ మహాగణాధిపతయే నమః - స్థిరోభవ - వరదోభవ - సుముఖోభవ - సుప్రసన్నోభవ - స్థిరాసనంకురు ॥

**ప్రార్థన :**

స్వామిన్ సర్వజగన్నాథయావత్పూజావసానకం ।
తావత్త్వం ప్రీతిభావేన బింబేస్మిన్ సన్నిధిం కురు ॥
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి ॥
సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః ॥

ఓం గణానాం త్వాగణపతిగ్ం హవామహే కవిఙ్కవీనాముపమశ్రవస్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతి భిస్సీదసాదనమ్ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః - ధ్యాయామి - ఆవాహయామి -

సువర్ణ రత్నఖచిత సింహాసనం సమర్పయామి, శ్రీ మహాగణాధిపతయే నమః పాదయోః పాద్యం సమర్పయామి,

శ్రీ మహాగణాధిపతయే నమః హస్తయోరర్ఘ్యం సమర్పయామి -
శ్రీ మహాగణాధిపతయే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి ॥

**స్నానం :**

ఓం ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జే దధాతాన । మహేరణాయ చక్షసే ।
యోవశ్శివతమోరసస్తస్యభాజయతే హనః । ఉశతీరివమాతరః ।
తస్మా అరఙ్గమామవోయస్యక్షయాయ జన్వథ । ఆపోజనయథాచనః ॥
శ్రీ మహాగణాధిపతయే నమః । శుద్ధోదకస్నానం సమర్పయామి ॥
స్నానానన్తరమాచమనీయం సమర్పయామి ॥

**వస్త్రం :**

అభివస్త్రా సువసనాన్యర్షాభిధేనూస్సుదుఘాః పూయమానః ।
అభిచన్ద్రాభర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్రథినో దేవసోమ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి ॥
వస్త్రయుగ్మధారణానన్తర మాచమనీయం సమర్పయామి ॥

**యజ్ఞోపవీతం :**

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।
ఆయుష్యమగ్రియం ప్రతిముఞ్చశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥
శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి ॥
యజ్ఞోపవీత ధారణానన్తర మాచమనీయం సమర్పయామి ॥

**గంధం :**

గన్ధద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయేశ్రియమ్ ॥
శ్రీ మహాగణాధిపతయే నమః శ్రీ గన్ధం సమర్పయామి ॥
ఆయనే తేపరాయణే దూర్వారోహన్తుపుష్పిణీః ।
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్యగృహా ఇమే ॥
శ్రీ మహాగణాధిపతయే నమః గన్ధస్యోపరి అలఙ్కరణార్థం హరిద్రాక్షతాన్ సమర్పయామి ॥

**పుష్పైః పూజయామి :**

ఓం సుముఖాయ నమః । ఓం ఏకదన్తాయ నమః । ఓం కపిలాయ నమః । ఓం గజకర్ణకాయ నమః । ఓం లంబోదరాయ నమః । ఓం వికటాయ నమః । ఓం విఘ్నరాజాయ నమః । ఓం గణాధిపాయ నమః । ఓం ధూమకేతవే నమః । ఓం గణాధ్యక్షాయ నమః । ఓం ఫాలచన్ద్రాయ నమః । ఓం గజాననాయ నమః । ఓం వక్రతుండాయ నమః । ఓం శూర్పకర్ణాయ నమః । ఓం హేరంబాయ నమః । ఓం స్కన్దపూర్వజాయ నమః । ఓం సర్వసిద్ధిప్రదాయకాయ నమః । ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ॥ నానావిధ పరిమళ పత్ర పుష్పాక్షతాం సమర్పయామి ॥

**ధూపం :**

వనస్పత్యుద్భవై ర్దివ్యైర్నానాగంధైస్సు సంయుతః ।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతి గృహ్యతాం ।
శ్రీ మహాగణాధిపతయే నమః ధూపమాఘ్రాపయామి ॥
సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్ని నాయోజితం ప్రియం ।

గృహాణమఙ్గళం దీపం త్రైలోక్యతిమిరాపహ ।
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే ।
త్రాహిమాం నరకాద్ఘోరాద్దివ్యజ్యోతిర్నమోస్తుతే ॥
శ్రీ మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి ॥
ధూపదీపానన్తర మాచమనీయం సమర్పయామి ॥

**నైవేద్యం :**

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యమ్ । భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేన పరిషిఞ్చామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । యథాభాగం గుడోపహార నైవేద్యం సమర్పయామి ।

ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయస్వాహా । ఓం ఉదానాయస్వాహా । ఓం సమానాయస్వాహా । మధ్యే మధ్యే పానీయం సమర్పయామి । అమృతాపిధానమసి । ఉత్తరాపోశనం సమర్పయామి । హస్తౌప్రక్షాళయామి । పాదౌప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।

**తాంబూలం :**

పూగీఫలైస్సకర్పూరైర్నాగవల్లీదళైర్యుతం ।
ముక్తాచూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి । తాంబూల చర్వణానన్తర మాచమనీయం సమర్పయామి ।

**నీరాజనం :**

ఓం సమ్రాజం చ విరాజం చాభిశ్రీర్యాచనో గృహే । లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ం సృజామసి । శ్రీ మహాగణాధిపతయే నమః మంగళ నీరాజనం సమర్పయామి । నీరాజనానన్తరం ఆచమనీయం సమర్పయామి ॥

**మంత్రపుష్పం :**

సుముఖశ్చైక దన్తశ్చకపిలో గజకర్ణకః । లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచన్ద్రో గజాననః ।

వక్రతుండ శ్శూర్పకర్ణో హేరమ్బస్స్కన్దపూర్వజః ।
షోడశైతాని నామానియఃపఠేచ్ఛృణుయాదపి ।
విద్యారమ్భే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా ।
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే ।
శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణదివ్యమన్త్రపుష్పం సమర్పయామి ।

**ప్రదక్షిణం :**

యానికానిచ పాపాని జన్మాన్తర కృతానిచ ।
తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ।
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసమ్భవః ।
త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల ।
అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్షగణాధిప ।
శ్రీమహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।

యస్య స్మృత్యాచనామోక్త్యా తపఃపూజాక్రియాదిషు । న్యూనం సమ్పూర్ణతాం యాతి సద్యోవన్దే తమచ్యుతమ్ । మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప । యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥ అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతస్సు ప్రసన్నో వరదో భవతు ॥ ఉత్తరే శుభకర్మణ్య విఘ్నమస్త్వితి భవన్తోబ్రువన్తు । ఉత్తరే శుభ కర్మణ్య విఘ్నమస్తు । శ్రీ మహాగణాధిపతి దేవతా ప్రసాదం శిరసా గృహ్ణామి । శతమానమ్భవతి శతాయుః పురుషశ్శతేన్ద్రియ ఆయుష్యేవేన్ద్రియే ప్రతితిష్ఠతి ॥

యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తేహనాకం మహిమానస్సచన్తే యత్రపూర్వేసాధ్యాస్సన్తిదేవాః ।
శ్రీ మహాగణాధిపతిం యథాస్థానం ప్రవేశయామి ।
శోభనార్థం క్షేమాయ పునరాగమనాయచ ॥



## శ్రీ వినాయక వ్రతకల్పము

# శ్రీ వరసిద్ధి వినాయక పూజా ప్రారంభము

### ప్రార్థన

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వోవిఘ్నోపశాంతయే ॥

**ఆచమనం :** ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయ స్వాహా (అని మూడు సార్లు ఉద్ధరిణెతో నీళ్ళు కుడిచేతితో పోసుకొని త్రాగవలెను.) ఓం గోవిందాయ నమః , ఓం విష్ణవే నమః, ఓం మధుసూధనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః, ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః ॥

పూర్వ సంకల్ప ప్రకారేణ శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ముద్దిశ్య వరసిద్ధి వినాయక దేవతా ప్రీత్యర్థం శ్రీ వరసిద్ధి వినాయక దేవతా పూజాం కరిష్యే.

### ప్రాణ ప్రతిష్ఠా

ఓమ్ - అసునీతేపునరస్మాసుచక్షుః పునః ప్రాణమిహానోధేహి భోగమ్ ।
జ్యోక్ప శ్యేమసూర్యముచ్చరన్త మనుమతే మృడ యానస్స్వస్తి ।
అమృతం వైప్రాణాఅమృతమాపః ప్రాణానేవయథాస్థానముపహ్వాయతే ॥
స్వామిన్ సర్వజగన్నాథయావత్పూజావసానకం ।
తావత్త్వం ప్రీతిభావేన బింబేస్మిన్ సన్నిధిం కురు ॥
ఆవాహితో భవ, స్థాపితో భవ, సుప్రసన్నో భవ, వరదో భవ
అకుంఠితో భవ, స్థిరాసనం కురు, ప్రసీద, ప్రసీద, ప్రసీద.

**ధ్యానం :**

భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణం
విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజమహం భజే ॥
ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం
పాశాంకుశధరం దేవం ధ్యాయేత్సిద్ధి వినాయకమ్ ॥
ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభమ్ ।
భక్తాభీష్టప్రదం తస్మాత్ ధ్యాయేత్తం విఘ్ననాయకమ్ ॥
ధ్యాయేద్గజాననం దేవం తప్తకాంచన సన్నిభం
చతుర్భుజం మహాకాయం సర్వాభరణ భూషితం ॥
శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః ధ్యాయామి

**ఆవాహనం :**

అత్రాగచ్ఛ జగద్వంద్య సురరాజార్చితేశ్వర
అనాథనాథ సర్వజ్ఞ గౌరీగర్భ సముద్భవ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః ఆవాహయామి

**ఆసనం :**

మౌక్తికైః పుష్పరాగైశ్చ నానారత్నై ర్విరాజితం
రత్నసింహాసనం చారుప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః ఆసనం సమర్పయామి.

**పాద్యం :**

గజవక్త్ర నమస్తేస్తు సర్వాభీష్టప్రదాయక
భక్త్యా పాద్యం మయాదత్తం గృహాణ ద్విరదానన ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః పాదయోః పాద్యం సమర్పయామి.

**అర్ఘ్యం :**

గౌరీపుత్ర నమోస్తేస్తు శంకరప్రియనందన
గృహాణార్ఘ్యం మయాదత్తం గంధపుష్పాక్షతైర్యుతం ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

**ఆచమనం :**

అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణ వరపూజిత
గృహాణాచమనం దేవతుభ్యం దత్తం మయాప్రభో
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః ఆచమనీయం సమర్పయామి.

**మధుపర్కం :**

దధిక్షీర సమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం
మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోస్తుతే ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః మధుపర్కం సమర్పయామి

**పంచామృతస్నానం :**

పంచామృతైర్దేవ గృహాణ గణనాయక ।
అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణ గణపూజిత ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః పంచామృతస్నానం సమర్పయామి.

**ఫలోదక స్నానం :**

యాః ఫలినీర్యా ఆఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః
బృహస్పతి ప్రసూతా స్తానో ముంచన్త్వగ్ం హసః

**శుద్ధోదకస్నానం :**

గంగాది సర్వతీర్థేభ్యః ఆహృతైరమలై ర్జలైః
స్నానం కురుష్వ భగవన్నుమాపుత్ర నమోస్తుతే ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి.

**వస్త్రయుగ్మం :**

రక్తవస్త్రద్వయం చారు దేవయోగ్యం చ మంగళం
శుభప్రద గృహాణత్వం లంబోదర హరాత్మజ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి

**యజ్ఞోపవీతం :**

రాజతం బ్రహ్మసూత్రం చ కాంచనం చోత్తరీయకం
గృహాణ సర్వధర్మజ్ఞ భక్తానామిష్టదాయక ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

**గంధం :**

చందనాగరుకర్పూర కస్తూరీ కుంకుమాన్వితం
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః గంధం సమర్పయామి.

**పుష్పములు :**

సుగన్ధాని చ పుష్పాణి జాజికుందముఖానిచ
ఏకవింశతిపత్రాణి సంగృహాణ నమోస్తుతే ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః పుష్పాణి పూజయామి.

**అక్షతలు :**

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్స్తండులాన్ శుభాన్
గృహాణ పరమానంద ఈశపుత్ర నమోస్తుతే ॥

**అథాంగ పూజ**

ఓం గణేశాయ నమః పాదౌ పూజయామి
ఓం ఏకదంతాయ నమః గుల్ఫౌ పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః జానుని పూజయామి
ఓం విఘ్నరాజాయ నమః జంఘే పూజయామి
ఓం ఆఖువాహనాయ నమః ఊరూ పూజయామి
ఓం హేరంబాయ నమః కటిం పూజయామి
ఓం లంబోదరాయ నమః ఉదరం పూజయామి
ఓం శ్రీ గణనాథాయ నమః నాభిం పూజయామి
ఓం శ్రీ గణేశాయ నమః హృదయం పూజయామి
ఓం స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి
ఓం శ్రీ స్కందాగ్రజా నమః స్కందౌ పూజయామి
ఓం శ్రీ పాశహస్తాయ నమః హస్తౌ పూజయామి
ఓం గజవక్త్రాయ నమః వక్త్రం పూజయామి
ఓం విఘ్నహంత్రే నమః నేత్రౌ పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః కర్ణౌ పూజయామి
ఓం ఫాలచంద్రాయ నమః లలాటం పూజయామి
ఓం సర్వేశ్వరాయ నమః శిరః పూజయామి
ఓం విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి

## అథ ఏకవింశతి పత్ర పూజ

| | | |
|---|---|---|
| ఓం సుముఖాయ నమః | మాచీపత్రం | పూజయామి (మాచీపత్రం) |
| ఓం గణాధిపాయ నమః | బృహతీపత్రం | పూజయామి (నేలమునగ ఆకు) |
| ఓం ఉమాపుత్రాయ నమః | బిల్వపత్రం | పూజయామి (మారేడు ఆకు) |
| ఓం గజాననాయ నమః | దూర్వాయుగ్మపత్రం | పూజయామి (గరిక) |
| ఓం హరసూనవే నమః | దత్తూర పత్రం | పూజయామి (ఉమ్మెత్త) |
| ఓం లంబోదరాయ నమః | బదరీపత్రం | పూజయామి (రేగు ఆకు) |
| ఓం గుహాగ్రజాయ నమః | అపామార్గపత్రం | పూజయామి (ఉత్తరేణి) |
| ఓం గజకర్ణాయ నమః | తులసీపత్రం | పూజయామి (తులసి) |
| ఓం ఏకదంతాయ నమః | చూతపత్రం | పూజయామి (మామిడి) |
| ఓం వికటాయ నమః | కరవీరపత్రం | పూజయామి (గన్నేరు) |
| ఓం భిన్నదంతాయ నమః | విష్ణుక్రాంతపత్రం | పూజయామి (హరిక్రాంత ఆకు) |
| ఓం వటవే నమః | దాడిమీపత్రం | పూజయామి (దానిమ్మ) |
| ఓం సర్వేశ్వరాయ నమః | దేవదారుపత్రం | పూజయామి (దేవదారు) |
| ఓం ఫాలచంద్రాయ నమః | మరువకపత్రం | పూజయామి (మరువక) |
| ఓం హేరంబాయ నమః | సింధువారపత్రం | పూజయామి (వావిలాకు) |
| ఓం శూర్పకర్ణాయ నమః | జాజీపత్రం | పూజయామి (జాజి) |
| ఓం సురాగ్రజాయ నమః | గండకీపత్రం | పూజయామి (తీగగరిక) |
| ఓం ఇభవక్త్రాయ నమః | శమీపత్రం | పూజయామి (జమ్మి) |
| ఓం వినాయకాయ నమః | అశ్వత్థపత్రం | పూజయామి (రావి) |
| ఓం సురసేవితాయ నమః | అర్జునపత్రం | పూజయామి (మద్ది ఆకు) |
| ఓం కపిలాయ నమః | అర్కపత్రం | పూజయామి (జిల్లేడు) |
| ఓం గణేశ్వరాయ నమః | ఏకవింశతిపత్రాణి | పూజయామి |

## శ్రీ వినాయక అష్టోత్తర శతనామావళి

( ప్రతి నామమునకు ముందు"ఓం", చివర "నమః" చదుకొనవలెను. )

ఓం గజాననాయ నమః
గణాధ్యక్షాయ
విఘ్నరాజాయ
వినాయకాయ
ద్వైమాతురాయ
ద్విముఖాయ
ప్రముఖాయ
సుముఖాయ
కృతినే
సుప్రదీపాయ 10
సుఖనిధయే
సురాధ్యక్షాయ
సురారిఘ్నాయ
మహాగణపతయే
మాన్యాయ
మహాకాలాయ
మహాబలాయ
హేరంబాయ
హ్రస్వగ్రీవాయ
మహోదరాయ 20
మదోత్కటాయ
మహావీరాయ
మంత్రిణే
మంగళస్వరూపాయ
ప్రమదాయ
ప్రథమాయ
ప్రాజ్ఞాయ
విఘ్నకర్త్రే
విఘ్నహర్త్రే
విశ్వనేత్రాయ 30
విరాట్పతయే
శ్రీపతయే
వాక్పతయే
శృంగారిణే
ఆశ్రితవత్సలాయ
శివప్రియాయ
శాశ్వతాయ
భవాయ
బలోత్థితాయ
భవాత్మజాయ 40
పురాణపురుషాయ
పూష్ణే
పుష్కరోక్షిప్తవారిణే
అగ్రగణ్యాయ
అగ్రపూజ్యాయ
అగ్రగామినే
మంత్రకృతే
చామీకరప్రభాయ
సర్వాయ
సర్వోపన్యాసాయ 50
సర్వకర్త్రే
సర్వనేత్రాయ
సర్వసిద్ధిప్రదాయ
సర్వసిద్ధయే
లంబజఠరాయ
పార్వతీనందనాయ
ప్రభవే
కుమారగురవే
అక్షోభ్యాయ
కుంజరాసుర భంజనాయ 60
ప్రమోదాయ
మోదకప్రియాయ
కాంతిమతే
ధృతిమతే
కామినే
కపిత్థఫలప్రియాయ
బ్రహ్మవిద్యావిభవే
జిష్ణవే
విష్ణుప్రియాయ
భక్తజీవితాయ 70
జితమన్మథాయ
ఐశ్వర్యకారణాయ
జాయసే
యక్షకిన్నరసేవితాయ
శీఘ్రకారిణే
గంగాసుతాయ
గణాధీశాయ
గంభీరనినదాయ
వటవే
అభీష్టవరదాయ 80
జ్యోతిషే
భావగమ్యాయ
అవ్యయాయ
సత్యధర్మిణే
సరసాంబునిధయే
దివ్యాంగాయ
బ్రహ్మచారిణే
బ్రహ్మరూపిణే
మణికింకిణీమేఖలాయ
సమస్తదేవతామూర్తయే 90
సహిష్ణవే
సతతోత్థితాయ
పంచహస్తాయ
విఘాతకారిణే
విష్వగ్దృశే
విశ్వరక్షాకృతే
కల్యాణగురవే
ఉన్మత్తవేషాయ
అపరాజితే
సమస్తజగదాధారాయ 100
సర్వైశ్వర్యప్రదాయ
ఆక్రాంతచిదచిత్ప్రభవే
శ్రీ విఘ్నేశ్వరాయ
భక్తనిధయే
మంగళప్రదాయ
అపాకృత పరాక్రమాయ
సత్యై
మహేశాయ 108
శ్రీ వరసిద్ధివినాయకస్వామినే
నమః అష్టోత్తర
శతనామపూజాం
సమర్పయామి

## అథ దూర్వాయుగ్మపూజ

| | | |
|---|---|---|
| గణాధిపాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఉమాపుత్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఆఖువాహనాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| వినాయకాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఈశపుత్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| సర్వసిద్ధిప్రదాయకాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఏకదంతాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఇభవక్త్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| మూషికవాహనాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| కుమారగురవే నమః | దూర్వాయుగ్మం | పూజయామి |

**ధూపం :**

దశాంగం గుగ్గులోపేతం సుగంధం చ మనోహరం
ఉమాసుత నమస్తుభ్యం గృహాణవరదోభవ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః ధూపమాఘ్రాపయామి

**దీపం :**

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా
గృహాణ మంగళం దీపం ఈశపుత్ర నమోస్తుతే ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః దీపం దర్శయామి

**నైవేద్యం :**

సుగంధాన్ సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్
నైవేద్యం గృహ్యతాం దేవ చణముద్గైః ప్రకల్పితాన్ ।
భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ చోష్యం పానీయమేవ చ
ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః నైవేద్యం సమర్పయామి

**సువర్ణపుష్పం :**

సదానందద విఘ్నేశ పుష్కలాని ధనానిచ
భూమ్యాం స్థితాని భగవాన్ స్వీకురుష్వ వినాయక ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః సువర్ణ పుష్పం సమర్పయామి ॥

**తాంబూలం :**

పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః తాంబూలం సమర్పయామి

**నీరాజనం :**

ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైస్సదా
నీరాజనం మయాదత్తం గృహాణ వరదోభవ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః నీరాజనం దర్శయామి.

**మంత్రపుష్పం :**

గణాధిప నమస్తేస్తు ఉమాపుత్ర గజానన
వినాయక ఈశతనయ సర్వసిద్ధి ప్రదాయక
ఏకదంతైక వదన తథా మూషికవాహన
కుమారగురవే తుభ్యం అర్పయామి సుమాంజలిమ్ ॥
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః మంత్రపుష్పం సమర్పయామి

**ప్రదక్షిణం :**

ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ
నమస్తే విఘ్నరాజాయ నమస్తే విఘ్ననాశన
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

**పునరర్ఘ్యం :**

అర్ఘ్యం గృహాణ హేరంబ సర్వభద్ర ప్రదాయక
గంధపుష్పాక్షతైర్యుక్తం ప్రాతస్థం పాపనాశన
శ్రీ వరసిద్ధివినాయక స్వామినే నమః పునరర్ఘ్యం సమర్పయామి

**ప్రార్థన :**

నమస్తుభ్యం గణేశాయ నమస్తే విఘ్ననాశన
ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాంగతిం ।
వినాయక నమస్తుభ్యం సతతం మోదకప్రియ
నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

**క్షమాపణ :**

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం ॥
మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥
అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః
శ్రీ వరసిద్ధి వినాయక దేవతా స్సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు ॥

**పునఃపూజ :**

ఛత్రం ధారయామి, చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళికానారోహయామి, అశ్వానారోహయామి, గజానారోహయామి, శకటానారోహయామి, సమస్త రాజోపచార, భక్త్యోపచార, శక్త్యోపచార, మంత్రోపచార, ధైర్యోపచార, శాస్త్రోపచార పూజాం సమర్పయామి.

ఉత్తరే శుభకర్మణ్య విఘ్నమస్త్వితి భవన్తోబ్రువన్తు ।
ఉత్తరే శుభ కర్మణ్య విఘ్నమస్తు ।
శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ప్రసాదం శిరసా గృహ్ణామి ।

**పూజా విధానం సమాప్తం**

-0-

# విఘ్నేశ్వరోత్పత్తి

నైమిశారణ్యమున శౌనకాది మహర్షులకు సూతమహాముని విఘ్నేశ్వర ఉత్పత్తిని ఈ విధముగా తెలియచేసెను.

పూర్వము గజరూపము గల రాక్షసుడు శివుని గూర్చి ఘోర తపమును ఆచరించగా అతని తపస్సునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరము కోరుకోమనగా అంతట గజాసురుడు పరమేశ్వరుని స్తుతించి ఓ స్వామీ! నీవు ఎల్లప్పుడు నా యుదరమున వసించి కాపాడమని కోరగా భక్తసులభుడగు ఆ మహేశ్వరుడు అతని కోర్కె తీర్చ గజాసురుని ఉదరమున ప్రవేశించి సుఖముగా నుండె.

కైలాసమున పార్వతీదేవి భర్తజాడ తెలియక పలుతెరంగుల వెదుకుచు కొంత కాలమునకు గజాసుర గర్భస్తుండగుట తెలిసి రప్పించుకొను మార్గము గానక, విష్ణుమూర్తిని దర్శించి తన పతి వృత్తాంతమును తెలిపి, "ఓ మహానుభావా! పూర్వము భస్మాసురుని బారినుంచి నా పతిని రక్షించి, నా కొసగితివి. ఇప్పుడు గూడ నుపాయాంతరముచే రక్షింపుమని వేడగా, హరి యా పార్వతీదేవిని ఓదార్చి కైలాసమున నుండుమని దెల్పి, అంత నా హరియు బ్రహ్మాది దేవతలను పిలిపించి గజాసుర సంహారమునకు గంగిరెద్దుల మేళమే యుక్తమని భావించి పరమేశ్వరుని వాహనమగు నందిని గంగిరెద్దుగా అలంకరించి బ్రహ్మాది దేవతలకు విచిత్ర వేషములు ధరింపచేసి తానును చిరుగంటలు, సన్నాయిని దాల్చి గజాసుర పురంబునకు వచ్చి అచ్చటచ్చట జగన్మోహనముగా తిరుగాడుచుండ గజాసురుడు విని, వారలను పిలిచి, తన భవనము యెదుట గంగిరెద్దుల నాడింపుమని కోరగా బ్రహ్మాది దేవతలు తమ వాద్యవిశేషముల జోరుగొల్ప జగన్నాటక సూత్రధారియగు నా హరి చిత్ర విచిత్రములుగా గంగిరెద్దు నాడించగా గజాసురుండు పరమానంద భరితుడై మీకేమి కావలయునో కోరుకొనుడొసగెద అనగా హరి గజాసురుని దగ్గరకేగి "ఇది శివుని వాహనమగు నంది. శివునిని కనుగొనుటకు వచ్చె గాన శివుని నొసంగుమనిపల్కె. ఆ మాటలకు గజాసురుండు నివ్వెరపడి అతనిని రాక్షసాంతకుడగు శ్రీహరిగా నెటిగి ఇక తనకు మరణమే

నిశ్చయమను కొనుచు తన గర్భస్థుండగు పరమేశ్వరుని దలంచి "నీవు నా శిరస్సు త్రిలోకపూజ్యముగాచేసి, నా చర్మమును ధరింపవే" యని ప్రార్థించి విష్ణుమూర్తికి తన అంగీకారము తెలుపగా నాతండు నందిని ప్రేరేపింప నందియు తన శృంగములచే గజాసురుని చీల్చి సంహరించెను.

అంత మహేశ్వరుండు గజాసుర గర్భము నుండి వెలువడి విష్ణుమూర్తిని స్తుతించె. అంత నా హరియు "దుష్టాత్ములకిట్టి వరంబులీయరాదు. ఇచ్చినచో పాముకు పాలుపోసినట్లగునని యుపదేశించి ఈశ్వరుని బ్రహ్మాది దేవతలను వీడ్కొలిపి, తాను వైకుంఠమునకేగె. అంత శివుండును నందినెక్కి కైలాసంబున కతివేగంబున జనియె.

కైలాసంబున పార్వతీదేవి భర్తరాకను దేవతాదుల వలన విని ముదమంది అభ్యంగన స్నానమాచరించుచు నలుగుపిండితో నొక బాలుని జేసి ప్రాణం బొసగి, వాకిలి ద్వారమున కావలియుంచె. పార్వతీదేవి స్నానాంతరము సర్వాభరణములు నలంకరించుకొనుచు పతి ఆగమనమునకు నిరీక్షించు చుండె. అంత పరమేశ్వరుండు నంది నధిరోహించి లోనికి బోవ వాకిలి ద్వారమందున్న బాలకుడడ్డగింప, కోపావేశుడై త్రిశూలంబుచే బాలకుని కంఠంబు దునిమి లోనికేగె.

అంత పార్వతీదేవి భర్తనుగాంచి ఎదురేగి అర్ఘ్యపాద్యాదులచే పూజించె. అంత పరమానందమున వారిరువురు ప్రియసంభాషణలు ముచ్చటించు చుండ ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చె. అంత ఆ మహేశ్వరుడు తానొనరించిన పనికి చింతించి తాను తెచ్చిన గజాసుర శిరంబు నా బాలుని కతికించి ప్రాణంబొసంగి "గజాననుడు" అని నామంబొసగి యాతనిని పుత్ర ప్రేమంబున పార్వతీ పరమేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాననుండును సులభముగా నెక్కి తిరుగుటకు అనింద్యుడను నొక ఎలుకను వాహనముగా జేసికొనియె. కొంత కాలమునకు పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి జనియించె. ఇతడు మహాబలశాలి. ఇతని వాహనము నెమలి. దేవతల సేనా నాయకుడై ప్రఖ్యాతి గాంచి యుండెను.

## శ్రీ వరసిద్ధి వినాయక వ్రత కథా శ్లోకము

శ్లో॥ సింహ ప్రసేన మ వధీత్ । సింహో జాంబవతా హత: ।
సుకుమారక మారోదీ తవహ్యేష శ్యమంతక: ॥

## శ్రీ వినాయక వ్రతకథ

( వ్రతకథ చెప్పుకునే ముందు కొన్ని అక్షతలు చేతిలో ఉంచుకోవాలి. కథ పూర్తయిన తరువాత ఆ అక్షతలను శిరస్సుపై వేసుకోవాలి ).

పూర్వం చంద్రవంశానికి చెందిన ధర్మరాజు జ్ఞాతుల వలన సిరిసంపదలన్నీ పోగొట్టుకున్నాడు. భార్యతోనూ, తమ్ములతోనూ వనవాసం చేస్తూ ఒకనాడు నైమిశారణ్యానికి చేరుకున్నాడు. అక్కడ శౌనకాది ఋషులకు అనేక పురాణ రహస్యాలను బోధిస్తున్న సూతమహామునిని దర్శించి, నమస్కరించి "అయ్యా! మేము రాజ్యాధికారము, సమస్త వస్తు వాహనములను పోగొట్టుకున్నాము. ఈ కష్టాలన్నీ తీరి, పూర్వవైభవము పొందేలా ఏదయినా సులభమైన వ్రతాన్ని చెప్పవలసింది" అని ప్రార్థించాడు. అంత సూతుడు ధర్మరాజుకు వినాయకవ్రతం చేస్తే కష్టాలు తొలగిపోయి, సమస్త సౌఖ్యాలు కలుగుతాయంటూ ఇలా చెప్పసాగాడు.

"ఒకసారి కుమారస్వామి పరమశివుణ్ణి దర్శించి, తండ్రీ! మానవులు ఏ వ్రతం చేయడం వలన వంశవృద్ధిని పొంది, సమస్త కోరికలూ తీరి, సకల శుభాలను, విజయాలను, వైభవాలను పొందగలుగుతారో అటువంటి వ్రతాన్ని చెప్పవలసింది అని కోరాడు. అందుకు శివుడు, నాయనా! సర్వసంపత్కరము, ఉత్తమము, ఆయుష్కామార్థ సిద్ధిప్రదమైన వినాయకవ్రతమనే వ్రతమొకటున్నది. దీనిని భాద్రపద శుద్ధ చవితినాడు ఆచరించాలి. ఆ రోజు ఉదయమే నిద్రలేచి, స్నానం చేసి, నిత్యకర్మలు నెరవేర్చుకుని తమ శక్తి మేరకు బంగారంతోగాని, వెండితోగాని, లేదా కనీసం మట్టితోగాని విఘ్నేశ్వరుడి బొమ్మను చేసి, తమ ఇంటికి ఉత్తరదిక్కులో మండపాన్ని నిర్మించి, బియ్యాన్నిపోసి దానిపై అష్టాదళ పద్మాన్ని ఏర్పరచాలి. అందులో గణేశుని ప్రతిమను ప్రతిష్ఠించాలి. అనంతరం శ్వేతగంధాక్షతలు, పుష్పాలు, పత్రాలతో పూజించి, దూపదీపాలను, వెలగ, నేరేడు, చెఱకు మొదలైన ఫలములను, రకమునకు ఇరవై ఒకటి చొప్పున నివేదించాలి. నృత్య, గీత, వాద్య పురాణ పఠనాదులతో పూజను ముగించి, యధాశక్తి వేదవిదులైన బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలాదులను ఇవ్వాలి. బంధుజనంతో కలిసి భక్ష్యభోజ్యాదులతో భోజనం చేయాలి. మరునాడు ఉదయం నిత్యకర్మలు నెరవేర్చుకుని గణపతికి పున: పూజ చేయాలి. విప్రులను దక్షిణ తాంబూలాలతో తృప్తులను చేయాలి. ఈవిధంగా ఎవరైతే వినాయక వ్రతాన్ని చేస్తారో

వాళ్ళకి గణపతి ప్రసాదం వలన సకల కార్యములూ సిద్ధిస్తాయి. అన్ని వ్రతములలోకి అత్యుత్తమమైన ఈ వ్రతం త్రిలోక ప్రసిద్ధమై దేవ ముని గంధర్వాదులందరిచేతా ఆచరించబడింది అని పరమశివుడు కుమారస్వామికి చెప్పాడు.

కనక ధర్మరాజా, నువ్వు కూడా ఈ వ్రతాన్ని ఆచరించినట్లయితే నీ శత్రువులను జయించి సమస్త సుఖాలను పొందుతావు. గతంలో విదర్భ యువరాణి దమయంతి ఈ వ్రతం చేయడం వలనే తాను ప్రేమించిన నలమహారాజును పెండ్లాడగలిగింది.

## విఘ్నాధిపత్యం

ఒకనాడు దేవతలు, మునులు, మానవులు, పరమేశ్వరుని సేవించి, విఘ్నములకు ఒక అధిపతిని ఇమ్మని కోరారు. గజాననుడు తాను జ్యేష్ఠుడను గనుక ఆధిపత్యమును తనకు ఇమ్మని కోరాడు. గజాననుడు మరుగుజ్జువాడు, అనర్హుడు, అసమర్థుడు కాబట్టి ఆధిపత్యము తనకే ఇవ్వాలని కుమారస్వామి తండ్రిని వేడుకున్నాడు. అందుకు శివుడు తన కుమారులనుద్దేశించి "మీ ఇరువురిలో ఎవరు ముల్లోకములలోని పవిత్ర నదులన్నింటిలో స్నానము చేసి ముందుగా నా వద్దకు వస్తారో వారికి ఈ ఆధిపత్యం లభిస్తుంద"ని చెప్పాడు. అంత కుమారస్వామి చురుకుగా, సులువుగా సాగివెళ్ళాడు. గజాననుడు అచేతనుడయ్యాడు. మందగమనుడైన తాను ముల్లోకాల్లోని నదులన్నింటిలో వేగంగా స్నానం చేసి రావడం కష్టసాధ్యమని, తరుణోపాయం చెప్పమని తండ్రిని వేడుకున్నాడు. వినాయకుని బుద్ధి సూక్ష్మతకు మురిసిపోయిన శివుడు ఫలదాయకమగు నారాయణ మంత్రమును అనుగ్రహించాడు. నారములు అనగా జలములు. జలములన్నియూ నారాయణుని అధీనములు. అనగా నారాయణ మంత్రం అధీనంలో వుంటాయి. వినాయకుడు ఆ మంత్రం చదువుతూ తల్లిదండ్రుల చుట్టూ ప్రదక్షిణం చేయడం ప్రారంభించాడు. ఆ మంత్ర ప్రభావమున ప్రతి తీర్థస్నానమందును కుమారస్వామి కన్నా ముందే వినాయకుడు ప్రత్యక్షం కావడం ప్రారంభించాడు. ఇలా మూడు కోట్ల యాభై లక్షల నదులలో వినాయకుడే ముందుగా స్నానమాచరించడం చూసి కుమారస్వామి ఆశ్చర్యపడి కైలాసమునకు వెళ్ళాడు. తండ్రి సమీపమున వున్న గజాననుని చూచి నమస్కరించి "తండ్రీ! అన్నగారి మహిమ తెలియక ఆధిపత్యం అడిగాను. క్షమించండి. ఈ ఆధిపత్యం అన్నగారికే ఇవ్వండి" అని ప్రార్థించాడు.

## చంద్రుని పరిహాసం

అంత పరమేశ్వరుడు భాద్రపద శుద్ధ చవితినాడు గజాననునికి విఘ్నేశాధిపత్యం ఇచ్చాడు. ఆనాడు సర్వదేశస్థులు విఘ్నేశ్వరునికి తమ శక్తికొలది కుడుములు, అపూపములు మున్నగు పిండివంటలు, టెంకాయలు, తేనె, అరటిపండ్లు, పానకం,

వడపప్పు మొదలైనవి సమర్పించి, పూజించగా, విఘ్నేశ్వరుడు సంతుష్టుడై కుడుములు మున్నగునవి కొన్ని భక్షించి, కొన్ని వాహనమునకిచ్చి, కొన్ని చేత ధరించి మందగమనమున సూర్యాస్తమయ వేళకు కైలాసమునకు వెళ్ళి తల్లిదండ్రులకు ప్రణామం చేయబోయాడు. ఉదరం భూమికానిన, చేతులు భూమికానక ఇబ్బంది పడుచుండగా, శివుని శిరమునందున్న చంద్రుడు వినాయకుడి అవస్థ చూసి వికటముగా నవ్వాడు. అంత రాజదృష్టి సోకిన రాలుగూడ నుగ్గవుతాయి అనే సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి, అందున్న కుడుములన్నీ ఆ ప్రదేశమంతా దొర్లినవి. అతడు మృతి చెందాడు. అంత పార్వతి శోకించుచూ చంద్రుని చూచి "పాపాత్ముడా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించాడు. కాబట్టి నిన్ను చూచినవారు పాపాత్ములై నీలాపనిందలు పొందుదురుగాక" యని శపించింది.

## శమంతకోపాఖ్యానం

ద్వాపరయుగమున నారదుడు ద్వారకావాసియగు శ్రీకృష్ణుని దర్శించి, స్తుతించాడు. మాటల సందర్భంగా స్వామీ! సాయంకాలమయ్యింది. నేడు వినాయకచవితి కాబట్టి పార్వతీదేవి శాపం కారణంగా చంద్రుని చూడరాదు. ఇక సెలవు అని పూర్వ వృత్తాంతమంతయూ శ్రీకృష్ణునికి చెప్పి నారదుడు స్వర్గలోకమునకు వెళ్ళాడు. అంతట కృష్ణుడు ఆనాటి రాత్రి చంద్రుణ్ణి ఎవరూ చూడరాదని పట్టణంలో చాటించాడు. క్షీరప్రియుడగు శ్రీకృష్ణుడు నాటి రాత్రి తాను ఆకాశం వంక చూడక గోష్ఠమునకు పోయి పాలు పితుకుతూ పాలలో చంద్రుని ప్రతిబింబమును చూశాడు. ఆహా! ఇక నాకెట్టి అపనింద రానున్నదో అని అనుకున్నాడు.

కొన్నాళ్ళకు సత్రాజిత్తు సూర్యవరముచే శమంతకమణిని సంపాదించి ద్వారకా పట్టణమునకు శ్రీకృష్ణ దర్శనార్థమై వెళ్ళాడు. శ్రీకృష్ణుడు మర్యాదచేసి ఆ మణిని తనకిమ్మని అడిగాడు. "రోజుకు ఎనిమిది బారువుల బంగారమిచ్చుదానిని ఏ అప్పునకైన నెవ్వరు ఇవ్వరని సత్రాజిత్తు తిరస్కరించాడు. అంత ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఆ శమంతకమణిని కంఠమున ధరించి వేటాడడానికి అడవికి వెళ్ళాడు. ఒక సింహం ఆ మణిని మాంసఖండమని భ్రమించి అతడిని చంపి ఆ మణిని తీసుకుపోతుండగా, ఒక భల్లూకం ఆ సింహాన్ని చంపి ఆ మణిని తన కుమార్తెయగు జాంబవతికి ఆటవస్తువుగా ఇచ్చింది. మరునాడు సత్రాజిత్తు తమ్ముని మృతి విని, మణి ఇవ్వలేదని కృష్ణుడు నా సోదరుని చంపి రత్నం అపహరించాడని పట్టణమున చాటించాడు. అది కృష్ణుడు విని చవితినాడు పాలలో చంద్రబింబమును చూచిన దోషఫలమని అనుకున్నాడు. దానిని బాపుకొనుటకై బంధు సమేతుడై అరణ్యానికి పోయి వెదుకగా ఒకచోట ప్రసేనుని కళేబరం, సింహం కాలిజాడలు, పిదప ఎలుగుబంటి అడుగులు కనిపించాయి. ఆ దారిన పోవుచుండగా ఒక పర్వత

గుహ ద్వారంబును చూచి పరివారమును అక్కడ విడిచి కృష్ణుడు గుహలోపలికి వెళ్ళాడు. అచట బాలిక ఉయ్యాలపై కట్టిన మణిని శ్రీకృష్ణుడు చూశాడు. దానని తీసుకుని వస్తుండగా బాలిక ఏడవడం ప్రారంభించింది.

అంత జాంబవంతుడు ఆవేశంగా వచ్చి శ్రీకృష్ణుని పైబడి అరచుచు, గోళ్ళతో గుచ్చుతూ, కోరలతో కొరకుతూ ఘోరముగా యుద్ధము చేసెను. కృష్ణుడు వానిని బడద్రోసి వృక్షములుతోను, రాళ్ళతోను, తుదకు ముష్ఠిఘాతములతోను రాత్రిం బవళ్ళు తెలియక ఇరవై ఎనిమిది రోజులు యుద్ధము చేసెను. క్రమంగా జాంబవంతుని బలం క్షీణించింది. తననే ఓడిస్తున్న వ్యక్తి రావణ హంతకుడగు శ్రీరాముడే అని తెలుసుకున్నాడు. జాంబవంతుడు అంజలి ఘటించి "దేవాదిదేవా! ఆర్తజనపోషా! భక్తజనరక్షా! నిన్ను శ్రీరామచంద్రునిగా తెలుసుకొంటిని. ఆ కాలమున నాయందలి వాత్సల్యముచే వరం కోరుకొమ్మనగా, నా బుద్ధిమాంద్యమున మీతో ద్వంద్వయుద్ధం చేయవలెనని కోరుకున్నాను. భవిష్యత్తులో నీ కోరిక నెరవేరుతుందని మీరు సెలవిచ్చితిరి. అది మొదలు మీ నామస్మరణ చేయుచూ అనేక యుగములు గడిపాను. ఇప్పుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చారు. నాకు ఇక జీవితేచ్ఛ లేదు. నా అపరాధములు క్షమించి కాపాడుము. నీ కన్న వేరు దిక్కులేదు" అంటూ భీతిచే పరిపరి విధముల ప్రార్థింప, శ్రీకృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయూ తన హస్తములచే నిమిరి భయం పోగొట్టి ఇలా అన్నాడు. శమంతకమణిని అపహరించినట్లు నాపై ఆరోపణ వచ్చింది. అపనింద బాపుకొనుటకు ఇటు వచ్చాను. కాబట్టి మణిని ఇవ్వమని కోరాడు. జాంబవంతుడు శ్రీకృష్ణునికి మణిసహితముగ తన కుమార్తె జాంబవతిని కానుకగా ఇచ్చాడు.

అంత తన ఆలస్యమునకు పరితపించు బంధుమిత్ర సైన్యంబులకు ఆనందం కలిగించి కన్యారత్నంతోను, మణితోను శ్రీకృష్ణుడు పురం చేరుకున్నాడు. సత్రాజిత్తుని రప్పించి పిన్నలను పెద్దలను ఒకచోట చేర్చి యావత్ వృత్తాంతమును చెప్పాడు. శమంతకమణి సత్రాజిత్తుకు తిరిగి ఇచ్చేశాడు. దాంతో సత్రాజిత్తు "అయ్యో! లేనిపోని నింద మోపి దోషమునకు పాల్పడితి"నని విచారించి, మణిసహితముగ తన కూతురగు సత్యభామను భార్యగా సమర్పించి, "తన్ను క్షమింపు"మని వేడుకున్నాడు. శ్రీకృష్ణుడు సత్యభామను గైకొని మణి వలదని తిరిగి ఇచ్చాడు. "శ్రీకృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ సత్యభామలను పరిణయమాడాడు. అంత దేవాదులు, మునులు స్తుతించి "మీరు సమర్థులు కనుక నీలాపనింద బాపుకొంటిరి. మాకేమి గతి"యని ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై "భాద్రపద శుద్ధ చతుర్థినాడు ప్రమాదవశంబున చంద్రదర్శన మయ్యెనేని ఆనాడు గణపతిని యథావిధిగా పూజించి ఈ శమంతకమణి కథను విని అక్షతలు శిరంబున దాల్చువారు నీలాపనిందలు పొందకుండా వుందురుగాక" అని చెప్పాడు.

అంత దేవాదులు సంతోషించి, తమ ఇళ్ళకు వెళ్ళి ప్రతి సంవత్సరం బాధ్రపద శుద్ధ చతుర్థినాడు దేవతలు, మహర్షులు, మానవులు తమ తమ శక్తి కొలది గణపతిని పూజించి, అభీష్టసిద్ధి పొందుతూ సుఖసంతోషములతో ఉన్నారు.

ఈ వ్రతమును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు యథాశక్తిగా ఆచరించవచ్చును. గతములో వృత్రాసురుని చంపుటకు ముందు ఇంద్రుడును, సీతాదేవిని వెదుకుటకు ముందు శ్రీరాముడును, గంగను భూమి మీదకు తెచ్చుటకు భగీరథుడును, అమృతోత్పాదనము చేయుటకు ముందు దేవదానవులు, కుష్ఠువ్యాధి తొలగించుకొనుటకు సాంబుడును ఈ వరసిద్ధి వినాయక వ్రతము చేసిరి.

విద్య ప్రారంభించే ముందు చేసిన విద్యాలాభము, పుత్రులను పొందగోరువారు పూజించిన పుత్రులను, వివాహము నిమిత్తము కన్య పూజించిన మంచివరుడు లభించును. విధవ పూజించిన మరి ఏ జన్మలోను వైధవ్యము పొందదు. కావున ఈ వ్రతము చేసిన సకలైశ్వర్యములు పొంది సుఖముగా వుందురుగాక.

శ్లో॥ తొండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్ ॥

తలచెదనే గణనాథుని తలచెదనే విఘ్నపతిని దలచినపనిగా
దలచెదనే హేరంబుని దలచెద నా విఘ్నములను తొలగుట కొరకున్ ॥

అటుకులు కొబ్బరి పలుకులు చిటిబెల్లము నానుబ్రాలు చెఱకురసంబున్
నిటలాక్షు నగ్రసుతునకు బటుతరముగ విందుచేసి ప్రార్థింతు మదిన్ ॥

ఓ బొజ్జగణపయ్య నీ బంటు నేనయ్య
ఉండ్రాళ్ళ మీదికి దండు పంపు
కమ్మనినేయియు కడుముద్దపప్పును
బొజ్జనిండగ గదినుచు పొరలుకొనుచు

జయమంగళం నిత్య శుభమంగళం

**హరిః ఓం తత్సత్**

